# వక్తవ్యము

## భాసకవి

సంస్కృత శ్రవ్యకావ్యప్రపంచమునకు వాల్మీకిమహర్షి యెట్టివాఁడో దృశ్యకావ్యక్షేత్రమునకు భాసమహాకవి యట్టివాఁడు. ఈతని ప్రజ్ఞాప్రకర్షమును కాళిదాస, బాణ, రాజశేఖర, పీయూషవర్షాది సంస్కృతకవీంద్రులు పలువు రుగ్గడించియున్నారు. కాని సంస్కృత సాహిత్యపు దురదృష్టవశమున 1910 సంవత్సరమువఱకును నీతని నాటకచక్రము వెలుఁగు చూడఁజాలకపోయినది. 1910 ప్రాంతమున మహామహోపాధ్యాయ శ్రీగణపతిశాస్త్రిగారు కేరళదేశమున వీనిని గనుఁగొని ప్రకటించుటతో సంస్కృతరూపక వాఙ్మయమునకుఁ గ్రొత్త చైతన్యము వచ్చినది.

ఈ రూపకములు అసలు భాసునివగునా ? కాదా ? యను వాదోపవాదములు గాలిదుమారములవలె చెలరేఁగినవి. సాహిత్యవేత్తలు కొందఱీనాటకముల నిశితముగఁ బరీక్షించి స్వప్నవాసవదత్త మీతనిదగుట నిస్సందేహమనియు దాని పోలికలు స్పష్టముగఁ గాన్పించుచుండుటచేఁ దక్కిన రూపకములు సయిత మీతని రచనములనుట కెట్టి సంశయము లేదనియు సోపపత్తికముగ నిరూపించిరి.

మహాకవి కాళిదాసుకూడ నీతని సబహుమానముగ స్మరించియుండుటచేతను, నతనికి బూర్వులగు నశ్వఘోషాది కవులీతని పద్యముల ననుకరించుటచేతను, అర్థశాస్త్రమున సయిత మీతని పద్యానుకరణములు గాన్పించుటచేతను, నీతఁడు క్రీ॥ పూ॥ 4 శతాబ్దివాఁడని పరిశోధకులు నిర్ణయించిరి. ఇందువలన భాసకవి చాణక్యునకు వృద్ధసమకాలికుఁడనియు, నితనిరూపక భరతవాక్యములందలి రాజసింహుఁడు చంద్రగుప్తునికంటె నన్యుఁడు కాఁడనియు నవగతమగుచున్నది.

## రచనములు

ఈతని రచనములు మొత్త ముప్పదిమూఁడని కొందఱును, ముప్పదినా లని కొందఱును నందురు. కాని ప్రస్తుతము దొరకినవి మాత్రము పదుమూఁడు. అందగ్రగణ్యమైన దీ స్వప్నవాసవదత్తమని పలువురందురు. పిమ్మట గణనీయము లైనవి, ప్రతిమ, అభిషేక, పంచరాత్ర, అవిమారకాది రూపకములు.

## విశిష్టత

శాకుంతలాది ప్రసిద్ధసంస్కృతనాటకములందుఁ బ్రౌఢకవితావాసన యెంత కాదన్నను గుప్పుమనుచుండును. భాసకవి రచనములం దట్లు కాక నాటకశిల్పము సర్వతోముఖప్రతిభతో సాక్షాత్కరించును. రసస్ఫూర్తికిఁ గవితకంటె నీతఁడపూర్వసన్నివేశముల నుపయోగించును. ఏస్థితియందును గవిత నాటకత్వమును ద్రొక్కి చేయకుండ నీతఁడు తన రచనలనన్నిటిని జాగరూకతతో నడపికొనిపోవుచుండును.

## స్వప్నవాసవదత్తము

ఒకప్పు డీ నాటకమునకును, వేఱొకరి రచనమునకును, బోటీపడి పరీక్షార్థము రెండిటిని నగ్నిలో వేయగా వాసవదత్త కాలిపోకుండ నిలిచినదఁట! దీని ప్రశస్తి నుగ్గడించుట కెంత చక్కనికథ కల్పించిరో చూడుడు! దీని ప్రకర్షయంతయు నిందలి సన్నివేశసౌందర్యముపై నాధారపడియున్నది. ఈతని యనితరసాధారణ పాత్రసృష్టియును బ్రశంసార్హమైనది.

ఒక మహాప్రయోజనమునకై మంత్రి యౌగంధరాయణుఁడు రాణి వాసవదత్తను, సాధారణ స్త్రీవేషముతోఁ దన వెంటఁ దీసికొనివచ్చి కొన్ని నియమములను గల్పించినాఁడు. తనభర్త శ్రేయస్సాధనకై యన్నింటికి నామె తలయొగ్గినది. మగధారణ్యప్రాంతమున, లావాణకమునుండి వచ్చిన బ్రహ్మచారి వత్సరాజ విరహవ్యథను వర్ణించునపుడును, తన యెదుటనే తనపతికి వేఱొకయువతితో జరుగు కల్యాణోత్సవమును జూడవలసి వచ్చి

చెప్పుడును, కలలోఁ దన్నుగాంచి నిరతిశయప్రేమతో హృదయేశ్వరుఁడు పలవించి పిలుచునపుడును, నాయిల్లాలి చిత్తస్థితిని చిత్రించిచూపిన భాసకవి ప్రజ్ఞ అనన్యసామాన్యమనిపించును. ఈ సన్నివేశనిర్మాణమునందే యీ నాటకఘనత నిలిచియున్నది. పతాలికమైన యిందలి స్వప్నసంఘటనమే భవభూతి యుత్తరచరితమ్ము ద్వితీయాంకరసవద్ఘట్టమునకు మార్గదర్శియైనది.

ఇందలి పద్మావతి సౌజన్యము, వాసవదత్త భర్తృప్రేమ, యౌగంధరాయణు రాజభక్తి, ధ్రువతారలై ప్రపంచమునకు వెల్గుచూపునట్టివి.

## అనువాదము

ఈ యనువాదము సుమారు పదేండ్లకుఁబూర్వమే ప్రదర్శనాభిలాషతోఁ జేయఁబడినది. కాని ప్రదర్శనముజరుగలేదు. ప్రకటింపవలెనను కుతూహలమప్పుడు లేకపోయినది. దీనికిఁ బూర్వమునను, పరమునను, పెద్దలు కొన్నియనువాదములు చేసి ప్రకటించియేయున్నారు. అయినను సంస్కృతనాటకముఁ జదివినప్పుడెల్లను మక్కికి మక్కిగాఁగాక స్వేచ్ఛగాఁ దెలుఁగుచేసిన నెట్లుండునోయను చాపలముమాత్రము వీడలేదు. దానిఫలిత మీరచనము. మాటలకొఱకుఁ బెనఁగులాడక వానివెనుకనున్న కవిహృదయమును సమీపింప శక్తికొలఁదిని బ్రయత్నించితిని. ఆమేరకుఁ గొన్నిమాటలు విడచుటయుఁ గొన్ని యౌచిత్యముకొలఁదిఁ గలుపుటయు జరిగినది.

ఈ రచనముచదివి కొంతవఱకైని భాసమహాకవి నాటకీయప్రతిభ నాంధ్రసహృదయులు దర్శింపగల్గినచో నాకృషి ఫలవంతమైనదనియే నేను సంతసింతును.

నాయందలి యవ్యాజానురాగముతో నీనాటకప్రకటనమునకు విశేషించి తోడ్పడిన మిత్రులు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని, తమ గ్రంథమాలలో నొకపుష్పముగఁ బ్రకటించుటకియ్యకొనిన శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారికిని కృతజ్ఞుఁడ నగుచున్నాను.

రామచంద్రపురము
24 – 6 – 51

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

# ఇందు వచ్చు పాత్రలు

1. యౌగంధరాయణుఁడు — వత్సరాజప్రధాని
2. వాసవదత్త — అవంతిరాజపుత్రిక-వత్సరాజపత్ని
3. కంచుకి — మగధరాజాంతఃపురవాసి
4. పద్మావతి — మగధరాజసోదరి-వత్సరాజ ద్వితీయభార్య
5. దాది — పద్మావతిని పెంచినది
6. వసంతకుఁడు — వత్సరాజ విదూషకుఁడు
7. ఉదయనుఁడు — వత్సదేశప్రభువు
8. పద్మినిక—మధురిక — పద్మావతి చెలులు
9. వసుంధర — వాసవదత్త దాది
10. రైభ్యుఁడు — అవంతిరాజకంచుకి.

# స్వప్నవాసవదత్తము

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి]

ఉదయనవచంద్రవర్ణమ్ము లోము మిమ్ము
అభినవాసవదత్త బలాఢ్యములును
రమ్యపద్మావతీర్ణపూర్ణమ్ములును, వ
సంతకమ్రమ్ములు బలభుజమ్ములెలమి.

సూత్రధారుఁడు

సభ్యమహాశయుల కిట్లు విన్నవింతును. (వినుట నభినయించి) ఏమిది ! నావిన్నపముతొందరలో నేనుండగా నేదో కలకలమువలె వినఁబడుచున్నది. (పరిశీలించును.)

నేపథ్యమున

అయ్యా ! తొలఁగిపొండు.—తొలఁగిపొండు.

సూత్ర

ఓహో ! తెలిసినది !

శ్రీమగధరాజభర్తృమద్భృత్యగణము
కన్యవెసువెంటవచ్చుచుఁ గానఁబడిన
తాపసశ్రేణియెడల నాదరమువీడి
తొలఁగఁగసరుచున్నారు ధూర్తులగుచు,

(నిష్క్రమించును.)

స్థాపన

# ప్ర థ మాం క ము

(భటుఁడొకఁడు ప్రవేశించుచు)

భటుఁడు

అయ్యా! తొలఁగిపొండు—తొలఁగిపొండు.

(పిమ్మట సన్న్యాసివేషధారి యౌగంధరాయణుఁడును అవంతికావేష ధారిణి వాసవదత్తయును ప్రవేశింతురు.)

యౌగంధరాయణుఁడు

(చెవియొగ్గి) ఏమి! ఇచటఁగూడఁ దొలఁగిపొమ్మనుటయేనా!

అడవులఁజేరి యందినఫలావళితోఁ దనుయాత్ర తృప్తిగాఁ
గడపుచు వల్కలమ్ములను గట్టుచు శాంతమనస్కులై చరిం
చెడి మునిలోకమాన్యులనిసీ! బెదరించెడి శ్రీమదాంధుఁడె
వ్వఁడు? వనసీమలో నగరివాసనలన్ బురికొల్పునాజ్ఞలన్.

వాసవదత్త

అయ్యా! ఈ తొలఁగిపొమ్మనువాఁడెవ్వఁడో!

యౌగంధ

ఎవఁడో ధర్మదూరుఁడు.

వాసవ

ఆర్యా! అదికాదునాయభిప్రాయము. ఇఁకనన్నుగూడఁ దొలఁగిపొమ్మందురేమో యని భయపడుచున్నాను.

యౌగంధ

అమ్మా! తెలియనిచో దేవతలనుసహిత మిట్లేతిరస్కరింతురు.

వాసవ

ఇప్పుడుపడుచున్న శ్రమకంటెఁగూడ నీపరాభవదుఃఖ మతి కష్టముగా నున్నది.

యౌగంధ

అమ్మా! ఒకనాఁడిట్టి విభవమంతయు నీవనుభవించి విడచి నదేగదా! ఇఁకఁ జింతయెందులకు?

శ్రీమతీ! నీయనుమతిఁ జేసికావె
గతిగొనియ్యెడి; ప్రభువును జయమునందు
మేటివగుదువు; చక్రనేమిక్రమమున
తిరుగుచుండును భాగ్యపంక్తియును జగతి.

భటులు

అయ్యో! తొలఁగిపొండు—తొలఁగిపొండు.

(కంచుకి ప్రవేశించి)

మునీశ్వరా!

యౌగంధ

(తనలో) ఎంత చక్కని పిలుపు! అలవాటు లేక నాకు మాత్రము క్రొత్తగా నున్నది.

కంచుకి

అయ్యా : ఈమె మా దర్శకమహారాజసోదరి పద్మావతి. ఈ యాశ్రమమునందున్న మహాదేవిని జూడవచ్చి యామె యనుజ్ఞనంది తిరిగి రాజగృహమునకుఁ బోవుచు ప్రస్తుత మీ యాశ్రమమునం దున్నది.

మీరు తీర్థోదకములు గాని, సమిధలు, పూవులు, దర్భలు మొదలైన తపోధనములు గాని, స్వేచ్ఛగా నడవినుండి తెచ్చుకొనవచ్చును. ధర్మాత్మురాలగు మా రాజపుత్రి యెన్నఁడును ధర్మహాని చేయదు. ఈమె కిది కులవ్రతము.

యౌగంధ

(తనలో) ఓహో ! అట్లనా ! ఈమెయేనా ఆ మగధరాజకుమారి పద్మావతి ! పుష్పకభద్రాది జ్యోతిషికులు మా రాజునకు దేవియగునని చెప్పిరి.

ద్వేషమైనను అనురాగదీప్తియైన
మన మనమ్ములయందె సంభవము నొందు
భాగ్యవేత్తలు మా ప్రభువరున కీమె
రాణియగునన మాకు గౌరవము తోఁచె.

వాసవ

రాజకుమారి యని వినఁగానే ఏమో నా కీమెయందు సోదరీస్నేహము కలుగుచున్నది.

(పరివారము పోవును, ఒక చెలికత్తె తోడను, పద్మావతి ప్రవేశించును)

చెలి

అమ్మా! ఇటు - ఇటు. ఇదిగో ఆశ్రమప్రదేశము.

(ఒక తాపసి కూర్చుండియుండును)

తాపసి

రాజకుమారీ! స్వాగతము.

వాసవ

(తనలో) ఈమె ఆ రాజపుత్రికయా? కులమునకుఁ దగిన సౌందర్యము!

పద్మావతి

అమ్మా! నమస్కారము.

తాపసి

ఆయుష్మతివి కమ్ము, అమ్మాయీ! రమ్ము - రమ్ము. తపోవనము అనఁగా అతిథిజనులకు స్వగృహమే గదా?

పద్మా

అవునమ్మా! మీ బహుమానవాక్యములచే నన్ననుగ్రహించితిరి.

వాసవ

(తనలో) రూపమే కాదు, ఈమె వాక్కు కూడ మధురమైనది.

తాపసి

(చెలికత్తెతో) కల్యాణీ! ఏ రాజకుమారుఁడును మన మహారాజసోదరి నింకను వరింపలేదా?

చెలి

వరింపకేమి. ఉజ్జయినీ పురాధీశుఁడు ప్రద్యోతుఁడు తన కుమారునికై దూతల నంపుచున్నాఁడు.

వాసవ

(తనలో) మంచిది. ఈమె నా కిప్పుడాత్మీయురాలైనది.

తాపసి

ఈ గౌరవమున కీమె లావణ్యము తగినది. ఉభయరాజ కులములును ఉన్నతములనియే మా వినుకలి.

పద్మి

(కంచుకితో) మనల ననుగ్రహించుమునుల నెవ్వరినైన చూచితివా? కోరినవారి మనోరథముల నెఱవేర్తుమని తపస్విజనుల నాహ్వానింపుము.

కంచుకి

చిత్తము........ఓ మునీశ్వరులారా! వినుఁడు. శ్రీమగధరాజకుమారి మీయందు చనవుగలిగి ధర్మబుద్ధితో మీమనోరథములఁ దీర్ప నాహ్వానించుచున్నది. ఎవరికిఁ గలశము కావలెనో,

వస్త్రములు కావలెనో, గురుదక్షిణ కావలెనో దయచేసివచ్చి కోరుకొనుఁడు.

యౌగంధ

(ఆలోచించి) అవును. మంచియుపాయము స్ఫురించినది. (ప్రకాశముగ) అయ్యా! నేనొక అర్థిని.

పద్మా

అమ్మయ్య! ఇప్పటికి నాతపోవనప్రవేశము సఫలమయినది.

తాపసి

ఈ యాశ్రమమునందలి మునులకోరికలన్నియు నిదివఱకే తీఱినవి. ఇతఁడెవ్వఁడో క్రొత్తవాఁడు కాఁబోలు.

కంచుకి

ఏమయ్యా! నీకేమికావలెను?

యౌగంధ

(వాసవదత్తను చూపుచు) ఈమె నాచెల్లెలు, కారణాంతరములచే భర్తనెడఁబాసియున్నది. ఈమెకు మీరాజపుత్రి కొన్నిదినములాశ్రయమీయవలెనని కోరుచున్నాను.

నాకు ధనముగాని, భోగములుగాని, వస్త్రములుగాని, అక్కఱలేదు. వృత్తికొఱకు నేను కాషాయవస్త్రములు ధరింపలేదు. ధర్మాత్మురాలగు మీరాజకన్యక మాసోదరిశీలము రక్షింపఁగలదని నాయాశ.

వాసవ

(తనలో) ఇదియేమి ! ఆర్యయౌగంధరాయణుఁడు నన్నిక్కడ విడిచి పోవలఁచినాఁడా ? దానిమూ ఆలోచింపకుండ అడుగడు కదా పనివాఁడుగదా ఈమహామంత్రి !

కంచుకి

(పద్మావతితో) అమ్మా ! ఇతనికోరిక మిక్కిలి యసాధ్యమైనది. సమ్మతించు టెట్లు ?

విత్తము సుఖమ్ముగా నిచ్చివేయవచ్చు
ప్రాణము తపఃఫలమ్ము నీవచ్చుఁడుదకు
కాని, దాఁపరికపుసొత్తుపూని దాఁచి,
కాఁచియర్పించుటన్న దుష్కరముగాదె.

పద్మావతి

అయ్యా ! మొదట కోరుకొనుఁడని యుద్ఘోషించి యిపుడు సందేహించుట న్యాయ్యముగాదు. ఎట్టిదైనను యితనికోరిక నెఱవేర్చియేతీరవలెను.

కంచుకి

అమ్మా ! ఔదార్యమునకుఁ దగినమాట పల్కితిరి. అయిన మీసమ్మతి యెఱుకపఱతును. (సమీపించి) అయ్యా ! మారాజపుత్రి మీసోదరి నాదరింప నంగీకరించినది.

యౌగంధ

పూజ్యురా లనుగ్రహించినదిగదా ! (వాసవతో) అమ్మాయీ ! ఆమెపట్టకు పొమ్ము.

వాసవ

(తనలో) ఏమిగతి ? మందభాగ్యురాల నిదిగో పోవుచున్నాను.

పద్మా

ఇప్పుడీమె నా కాత్మీయురాలైనది.

తాపసి

ఈ యసాధారణరూపము చూచినచో నీమెకూడ ఎవరో రాజ పుత్రికయని తోఁచుచున్నది.

చెలి

అమ్మా ! చక్కఁగాఁజెప్పితివి. నాకుగూడ నీమె యొకప్పుడు సర్వసౌఖ్యము లనుభవించినదని తోఁచుచున్నది.

యౌగంధ

(తనలో) అమ్మయ్య, నా భారము సగము తీఱినది. పూర్వము నేను మంత్రులతో నాలోచించినట్లుగనే ఇఁక సర్వము జరుగును. రాజట్లు ప్రతిష్ఠితుఁ డగును, ఈమెను తోడ్కొనివచ్చిన నాకు ఈ మగధ రాజపుత్రి విశ్వాసస్థానము కాఁగలదు.

తథ్యముగ నె పఘాంగి మా ధరణిపతికి
రాణి యగు : సిద్ధవాక్య మప్రతిహతమ్ము
వారి సుపరీక్షిత వచఃప్రకారముగనె
ఆపదలు సంపదలును సంప్రాప్తమగును.

(ఒక బ్రహ్మచారి ప్రవేశించును)

(బ్రహ్మచారి)

(పైకి చూచి) మధ్యాహ్నమయినది. మిక్కిలి యలసిపోయితిని. ఎక్కడ విశ్రమింతును ? ఓహో ఇదియంతయుఁ దపోవనమువలెఁ గాన్పించుచున్నది.

జింకలు చెంగునన్ జనవుచే వనమెల్లెడ దూఁకియాడు ని
శ్శంకముగా: సమస్తతరుశాఖలు పూవులఁ బండ్లశోభిలెన్:
సంకులమయ్యె కాపిలము చక్కని గోకులమున్, బొలమ్ము లే
వంకనులేవు: తథ్యము తపఃస్థలియిద్ది పొగల్ వెలార్చెడిన్:

(ప్రవేశించి రాజభటులను జూచి) ఏమిది ! ఆశ్రమ విరుద్ధమైన జనము ? (ఇంకొకవైపు చూచి) తపస్విజనము కూడ నున్నది. సమీపింపవచ్చును. (నిదానించి) ఓహో ! స్త్రీజనము కూడ !

కంచుకి

అయ్యా ! స్వేచ్ఛగాఁ బ్రవేశింపవచ్చును. ఆశ్రమము సర్వసాధారణము గదా !

వాసవ

(అనిష్టముగ) హుం——(మూల్గును)

పద్మావతి

ఈమె పరపురుషదర్శనమును బరిహరించుచున్నది. సరే ఈ దాఁపరికమును జాగ్రత్తగాఁ గాపాడవలెను.

కంచుకి

అయ్యా! మేము నీకంటె ముందు వచ్చినారము. కనుక మాకును నీవతిథివి. ఆతిథ్యము స్వీకరింపుము.

బ్రహ్మచారి

(ఆచమనముచేసి) ఆహా! నా యలసట యించుక తీఱినది.

యౌగంధ

అయ్యా! యెచటినుండి రాక, ఎచటికిఁ బోవలెను?

బ్రహ్మ

రాజగృహమునుండి వచ్చుచున్నాఁడను. వేదవిశేషాభ్యాసము కొఱకుఁ గొన్నాళ్ళనుండి వత్సదేశమునందలి లావాణకపురమున నివసించుచుంటిని.

వాసవ

(తనలో) అయ్యో! లావాణకము! లావాణక స్మరణముచే నా దుఃఖము మఱల పచ్చిదగుచున్నది.

యౌగంధ

నీ విద్య పూర్తియైనదా ?

బ్రహ్మ

లేదండి.

యౌగంధ

విద్య పూర్తిగాకుండ నీ ప్రయాణ మెక్కడికి ?

బ్రహ్మ

ఈ మధ్య నచట నొక దారుణసంఘటనము జరిగినది.

యౌగంధ

ఏమది ?

బ్రహ్మచారి

అక్కడ ఉదయనుఁడను నొకరాజుకలఁడు.

యౌగంధ

సరే. పూజ్యశ్రీ ఉదయనమహారాజున్నుగూర్చి వినుచుందుము. ఊఁ అతఁడు ?

బ్రహ్మ

ఆతని కవంతిరాజపుత్రిక వాసవదత్తయందు మిక్కిలిమక్కువ.

యౌగంధ

కావచ్చును. తరువాత ?

బ్రహ్మ

ఆరాజొకనాఁడు వేటకుఁబోయినప్పుడు, ఊరంతటను నిప్పంటు కొన్నది. పాపమామె యా గ్రామదాహమున దగ్ధమైనది.

వాసవ

(తనలో) అనృతము—ఇదియంతయు ననృతము. దౌర్భా గ్యురాల నిదిగో బ్రదికియేయున్నాను.

యౌగంధ

తరువాత ?

బ్రహ్మ

పిమ్మట నామెను రక్షింపదలఁచి యౌగంధరాయణుఁడను మంత్రియును నందుదూఁకినాఁడు.

యౌగంధ

ఏమి ! నిజముగ దూఁకినాఁడా ? తరువాత ?

బ్రహ్మ

పిదప వేఁటనుండి తిరిగివచ్చి, రాజీ విషాదవృత్తాంతము విని, అట్టిభార్యమ నట్టిమంత్రిని గోల్పోయినందులకు మిగులవిలపించి తనప్రాణములనుగూడ వదలించుకొనదలఁచెను. కాని యెట్టకేలకు మంత్రుల మహాప్రయత్నముచే నాత్మహింసనుండి విరమించెను.

వాసవ

(తనలో) అయ్యో ! ఎఱుఁగుదును. ఆర్యపుత్రునకు నాయం దున్న యపారకృప నెఱుఁగుదును.

యౌగంధ

తరువాత ?

బ్రహ్మ

పిమ్మటఁ గాలిపోగా మిగిలిన యామె యాభరణములను గౌఁగి లించుకొని రాజు మూర్ఛిల్లినాఁడు.

(అందఱును)

అయ్యో ! —

వాసవ

(తనలో సాధిక్షేపముగ) ఆర్య యౌగంధరాయణుని కోరిక యిప్పటికి నెఱవేరినది.

చెలి

అమ్మా ! యీమె కంటనీరుపెట్టుచున్నది.

పద్మా

పాపము ! జాలిగుండెగలది గాబోలును !

యౌగంధ

అవునవును. మాచెల్లెలిది మిక్కిలిజాలిగుండె. ఊఁ, తరువాత నేమిజరిగినది ?

బ్రహ్మ

పిమ్మట మెల్లమెల్లఁగ మూర్ఛనుండి తేఱుకొనినాఁడు.

పద్మా

(తనలో) అదృష్టముండి మరల బ్రదికినాఁడు. మూర్ఛిల్లెనని వినఁగానే ఏమో నామనసు శూన్యమైపోయినది.

యౌగంధ

తరువాత ?

బ్రహ్మ

ఆ రాజు వెంటనే భూమిపైఁబడి ధూళిధూసరిత శరీరముతో నువ్వెత్తుగ లేచి హా....వాసవదత్తా — అవంతి రాజపుత్రీ ... ప్రియురాలా....ప్రియశిష్యురాలా....అని యేమేమో పరితపించి నాఁడు. వేయేల—

కనము తాదృశచక్రవాకద్వయమ్ము !
వినగలే దట్టి ప్రేయసీ విరహజనుల ;
అంతగా భర్తృవాల్లభ్య మందుకొనిన
తరుణి దగ్ధయెయయ్యొ విదగ్ధయయ్యొ,

యౌగంధ

అయ్యొ ! యే మంత్రియును నతని నోదార్పలేకపోయెనా ?

బ్రహ్మ

లేకేమి ? రుమణ్వంతుఁడను మంత్రి రాజు నోదార్ప నెంత యేని ప్రయత్నించినాఁడు.

భోజసమొల్లమిన్ నృపుని బోలెను: కన్నులువాచెనేడ్పునన్;
రాజు ప్రసాధనమ్ముల నిరాకరణమ్మొనరింప నీతఁడా
యోజననిర్చె : దుఃఖితనృపోత్తముతో సమదుఃఖవేదనా
భాజనుఁడై విభుం గొలిచె: పార్థివుఁడున్నె యతండులేనిచో ?

వాసవ

(తనలో) అదృష్టవశమున నార్యపుత్రుఁడు మంచివారిచేతిలోఁ బడినాఁడు.

యౌగంధ

(తనలో) ఆహా ! పాపము ! రుమణ్వంతుఁడు తగని బరువు మోయుచున్నాఁడు. నా భారమునకు విశ్రాంతి దొరికినది. అతని శ్రమ నిలిచియేయున్నది. రాజు ననుసరించియుండుటచే నతని బాధ్యత యెక్కువైనది. (ప్రకాశముగ) అయిన రా జిప్పటికైనను దేరుకొనెనా ?

బ్రహ్మచారి

అది నాకుఁ దెలియదు. "ఇచట నామెతో నవ్వితిని. ఇచట సంలపించితిని. ఇచట గూర్చుంటిమి. ఇచట గోపించితిమి— ఇచట నిద్రించితిమి." అని విలపించు రాజును మంత్రులు పెద్ద ప్రయత్నముతో పేరొకచోటికి గొనిపోయిరి, రాజచటినుండి వెడలిపోగా తారకాచంద్రహీనమైన యాకాశమువలె ఆ పట్టణము శోభాహీనమైనది. నే నచటినుండి వెంటనే ప్రయాణము గట్టితిని.

తాపసి

ఆగంతుకునిచేఁగూడ నింతగాఁ బ్రశంసింపఁబడు నా రాజెంత గుణవంతుఁడో గదా !

చెలి

అమ్మా ! ఇంక నే యువతి యా రాజచంద్రుని పాణిగ్రహణమునకు నోచుకొనెనో !

పద్మా

(తనలో) సరిగా నా మనసులోని ప్రశ్న నడిగితివే !

బ్రహ్మ

అయ్యా ! సెలవు. పోవుదును.

కంచుకి - యౌగంధ.

మంచిది.

బ్రహ్మ

(నిష్క్రమించును)

యౌగంధ

సరే. నేను గూడ రాజకుమారి సెలవుఁ గైకొనిపోవుదును.

కంచుకి

(పద్మావతితో) అమ్మా ! ఈయన గూడ సెలవు తీసికొని పోఁదలఁచుచున్నాఁడు.

పద్మా

మీరు లేనిచో మీ చెల్లెలు బెంగపెట్టుకొనునేమో.

యౌగంధ

సజ్జనుల సన్నిధినున్నయామెకు బెంగ యేల కలుగును.
(కంచుకి నుద్దేశించి) అయ్యా! పోవుదును.

కంచుకి

మంచిది. పోయిరమ్మ-మఱల(గలసికొందము.

యౌగంధ

తథాస్తు. (పోవును.)

కంచుకి

అమ్మా! లో(గిలిలోనికి(బోవు సమయమైనది.

పద్మా

(తాపసితో) అమ్మా! నమస్కారము.

తాపసి

తగినభర్తనొందుము తల్లీ!

వాసవ

అమ్మా! అభివాదనము చేయుచున్నాను.

తాపసి

అచిరకాలములో భర్తృసమాగమము కలుగుగాక.

వాసవ

మీయనుగ్రహము.

కంచుకి

రాజకుమారీ! రమ్మ! పోవుదము! ఇప్పుడు—

పులుగులు గూండ్లకున్ దిరిగిపోవుచునుండె; మునీంద్రులున్నదీ
జలములలోనఁ గ్రుంకులిడసాగిరి; యగ్నులువెల్గె; ధూమపం
క్తులు చెలరేఁగెనాశ్రమముత్రోవల; దూరమునన్ దివాకరుం
డలసి రథమ్ముఁద్రిప్పికొని యస్తగిరీంద్రపథమ్ముపట్టెడిన్.

(అందఱు నిష్క్రమింతురు.)

---

# స్వప్న వాసవదత్తము

## ద్వితీయాంకము

(ఒకచెలికత్తె ప్రవేశించును.)

చెలి

కుంజరికా... కుంజరికా. రాజకుమారి శ్రీపద్మాదేవి యెక్కడ? (వినుటనభినయించి) ఏమందువు .... మాధవీలతామంటపమువద్ద రాజపుత్రి బంతితో నాడుచున్నదనియా! సరే! ఆమెవద్దకుఁ బోవుదును. (కొంచమునడచి ముందుకుచూచి) ఇదిగో! రాజపుత్రి. కర్ణభూషణములు చిక్కువడ స్వేదబిందువులునిండిన చక్కని ముఖముతో నిటేవచ్చుచున్నది.

(ప్రవేశకము)

(బంతితోఆడుచు పరివారముతోడను వాసవదత్తతోడను పద్మావతి ప్రవేశించును.)

వాసవ

సఖీ! ఇదిగో నీబంతి.

పద్మా

అమ్మా! ఇఁకనీయాట చాలింతము.

వాసవ

సఖీ ! చాలసేపాడితివి. మిక్కిలి యెఱుపెక్కినచేతులు ఇంకొకరి చేతులవలెనున్నవి.

చెలి

రాజకుమారీ ! విడువకుండనాడుము. కన్యాభావసుందరమైన కాలము వ్యర్థముచేయకుము.

పద్మా

ఎగతాళిచేయుచున్నావా ?

వాసవ

కాదుసఖీ—కాదు. ఇప్పుడు నీముఖము సర్వతోముఖముగ ముద్దులొల్కుచున్నది.

పద్మావతి

పొమ్ము — నన్ను పరిహాసింపకుము.

వాసవ

(పరిహాసముగ) మహాసేన మహారాజు కోడలా ! ఇదిగో ఇంక మాటలాడను.

పద్మా

(కుతూహలముగ) ఎవరమ్మా ! యీ మహాసేనుఁడు ?

వాసవ

ఉజ్జయినీపురాధీశ్వరుఁడు ప్రద్యోతుఁడు. బలప్రమాణముచే నతనికి మహాసేనుఁడని పేరు.

చెలి

(వాసవదత్తతో) మన రాకుమారి కా సంబంధ మిష్టముకాదు.

వాసవ

అయిన నే సంబంధ మిష్టము ?

చెలి

వత్సదేశపురాజు ఉదయనుఁడని యున్నాఁడు. అతని సుగుణములను విని వరించుచున్నది.

వాసవ

(బాధగ తనలో) ఆర్యపుత్రునా యీమె భర్తగఁ గోరుచున్నది. (ప్రకాశముగ) అతనిని వరించుటకు కారణము ?

చెలి

దయాశాలియని.

వాసవ

(తనలో) అవును (తన్నుద్దేశించి) ఈమెగూడ నిందుకే వెఱ్ఱియైనది.

చెలి

అమ్మా ! ఆరాజు రూపసికాడా ?

వాసవ

కాకేమి. దర్శనీయుఁడు.

పద్మా

నీ కెట్లు తెలియును ?

వాసవదత్త

(తనలో) అయ్యో ! పక్షపాతముచే నాచారము నతిక్రమించితిని. ఇప్పు డేమి చేయుదును — కానిమ్మ—(ప్రకాశముగ) ఇట్లుజ్జయినీపురజను లనుకొందురు.

పద్మా

కావచ్చును. ఉజ్జయినీపురజనుల కీతఁడు దుర్లభుఁడు గాఁడు. సౌందర్యము సర్వజనాకర్షకము గదా !

(దాది ప్రవేశించి)

దాది

రాజపుత్రికకు జయము. రాజకుమారి నిన్నిచ్చినారు.

వాసవ

ఎవరికమ్మా ?

దాది

శ్రీవత్సరాజు ఉదయనునకు.

వాసవ

(ఆశ్చర్యముతో) ఏమీ—ఆ రాజు కుశలముగ నున్నాఁడా ?

దాది

కుశలమేమి, అతఁ డిచటికి వచ్చినాఁడు. ఆతనికి మన రాజపుత్రిక నిచ్చుటకు నిశ్చయమైనది గూడ.

వాసవ

అయ్యో !

దాది

ఏమమ్మా....అట్లంటివి ?

వాసవ

అబ్బే ఏమియును లేదు, అపు డట్లు వాసవదత్తకై దురపిల్లి యింతలోనే యుదాసీనుఁడయ్యెనా యని.

దాది

అమ్మా ! మహాపురుష హృదయములు శాస్త్రప్రధానములు. సులభముగఁ దేరుకొనుచుండును.

వాసవ

అమ్మా ! స్వయముగానే ఆతఁడీమెను వరించెనా ?

దాది

లేదు....లేదు. ఇంకొకపనిమీద నిక్కడికిరాగా నాతనిసత్కుల విజ్ఞానవయస్సౌందర్యములను జూచి మనమహారాజే యీమెనతని కీయఁదలఁచెను.

వాసవ

(తనలో) అటులనా....అయినచో ఆర్యపుత్రు డనపరాధి.

(ఇంకొకచెలికత్తె ప్రవేశించి)

చెలి

(పద్మావతితో) అమ్మా! త్వరపడవలెను. ఇప్పుడేమంచినక్షత్ర మఁట. కనుకవెంటనే కౌతుకమంగళము జరుగవలెనని మహారాణిగారు సెలవిచ్చినారు.

వాసవ

(తనలో) ఈమె తొందర పెట్టుచున్నకొలఁదివి నాహృదయ మంధకారబంధుర మగుచున్నది.

దాది

రాజపుత్రీ! రమ్మా రమ్మా.

(నిష్క్రమింతురు.)

---

# స్వప్న వాసవదత్తము

## తృతీయాంకము

(చింతానిమగ్న వాసవదత్త ప్రవేశము)

వాసవ

వివాహోత్సవ కోలాహలముతోనిండిన అంతఃపురప్రాంగణమున పద్మావతినివిడిచి ఈ ఉద్యానవనమును చేరుకొంటిని. దురదృష్టము నాపైత్రోసినదుఃఖము నిచటఁ దొలఁగించుకొందును. (ముందునకు నడచి) ఆయ్యో! ఆర్యపుత్రుఁడుగూడ నిపుడు పరుఁడైనాఁడు. (కూర్చుండి) ప్రియవియోగదుఃఖమున ప్రాణములను తిరస్కరించు చక్రవాకవధువు ధన్యురాలుగదా! నా ప్రాణములింకను నిల్చియేయున్నవి. ఇంకను ఆర్యపుత్రుని చూడవచ్చునను మనోరథమే ఈమందభాగ్యురాలిని బ్రతికించుచున్నది.

(ఒకచెలికత్తె పూపులనుబట్టుకొని ప్రవేశించుము.)

చెలి

పూజ్యురాలు అవంతిక ఎచటికిపోయినదోకదా! (ముందునకు చూచి) ఓహో ఏలకోపాపమీమె విచారశూన్యహృదయయై మంచుపాటున మలినమైన శశిరేఖవలె అలంకారవిహీనముగా నీప్రియంగు

లతామండపమున కూర్చున్నది. సమీపించి అమ్మా! అవంతికా! నిన్నెంతసేపటినుండియో వెదకుచున్నాను.

వాసవ

ఏమి——ఎందులకు?

చెలి

మహారాణి, మహాకులసంజాతవని, నేర్పరివని, స్నేహమయి వని ఈ కౌతుకపుష్పమాలను నీచేకూర్పించి తెమ్మని నన్ను బంపినది.

వాసవ

ఎవరికీ పుష్పమాల?

చెలి

మనరాజకుమారికి.

వాసవదత్త

(తనలో) ఈ మాలికనుగూడ నేనే కూర్చవలెనా? భగ వంతుని కెంత నిర్దయ!

చెలి

అమ్మా! దిక్కులు చూచుచు నేదో ఆలోచించుట కిది సమయము కాదు. ఇదిగో అల్లుడుగారపుడే మణిభూమియందు మంగళస్నానము చేయుచున్నారు. తొందరగా పూలమాల గ్రుచ్చవలెను.

వాసవ

(తనలో) ఇంక నేమియును జింతింపజాలనులే తల్లీ. (పైకి) సఖీ! అల్లుఁడుగారిని జూచితివా?

చెలి

ఓ! చూచితిని. రాజకుమారిపైఁ గల స్నేహముచేతను, నా కుతూహలముచేతను, జూచితిని.

వాసవ

ఆయన యెట్టివాఁడే?

చెలి

అమ్మా! ఇట్టివాని నింతకు ముం దెన్నఁడును చూచియుండ లేదు.

వాసవ

సఖీ! ఏమి! అంత చూడఁదగినవాఁడా?

చెలి

ధనుర్బాణములులేని సాక్షాన్మన్మథుఁడు!

వాసవ

సరే. పోనిమ్మా. మన కెందుకు?

చెలి

ఏమి! అడిగి వద్దందువు?

వాసవ

పరపురుషప్రసక్తి సముచితము గాదు.

చెలి

అయిన త్వరగా నీ పూలమాలను గ్రుచ్చుము.

వాసవ

గ్రుచ్చెదను — తెమ్మ.

చెలి

ఇదిగో—

వాసవ

(విడఁదీసిచూచి) ఏమిది ! ఈ మాలికలో మూలికలు గూడ నున్నవేమి ?

చెలి

ఇదిగో ! ఈ మూలికపేరు.... ఐదవతనము నిచ్చునది.

వాసవ

(తనలో) ఇది ముఖ్యముగా నాకును బద్మావతికిని గూడ గ్రుచ్చదగినదే. (పైకి) ఈ రెండవమూలిక ?

చెలి

దీనిపేరు సపత్నీమర్దనము.

వాసవ

(అనిష్టముగా) ఇది వద్దు.

చెలి

ఏమి ?

వాసవ

ఆతని మొదటిభార్య లేనేలేదు. ఇంక దీని ప్రయోజన మేమున్నది ?

(ఇంకొక చెలికత్తె ప్రవేశించి)

2 చెలి

అమ్మా ! త్వరపడవలెను, ఇదిగో అల్లుఁడుగారు పుణ్యస్త్రీలతోఁగూడ లోఁగిటఁ బ్రవేశించుచున్నారు,

వాసవ

ఇదిగో, మాలిక తీసికొనుము.

చెలి

మంచిదమ్మా. వెళ్లుచున్నాను (అని తీసికొనిపోవును).

వాసవ

ఈమె వెళ్లినది. ఆయ్యో ఎంతపని జరిగినది ! ఆర్యపుత్రుఁడుగూడ నిపుడు పరపురుషుఁడై పోయెనా ! యీపైని శయ్యపైఁజేరి యెట్లో కన్నుమూసి నా దుఃఖము నపనయించుకొందును.

(నిష్క్రమించును)

---

# స్వప్నవాసవదత్తము

## చతుర్థాంకము

(ప్రవేశము—వసంతకుఁడు)

వసంతకుఁడు

ఆహా! భాగ్యవశమున పూజ్య శ్రీవత్సరాజు వివాహమంగళ సుందరసమయమును జూచితిని. అట్టి కష్టపుసుడిగుండములోఁబడి కొట్టుకొనుచున్నామేమింతలో నింతసుకరముగా తేలుదుమని యనుకొనలేదు. ఓహో! ఇపుడు మేడలపైనివాసము అంతఃపురపు దిగుడు బావులయందు నివాసము, మెత్తని తియ్యని మిఠాయిభోజనము, అప్సరసలులేనిస్వర్గలోకనివాసము ననుభవించుచున్నాను. ఒక్కటే గొప్పదోషము. తిన్నతిండిమాత్రము జీర్ణమగుటలేదు. చక్కని దుప్పటిపఱచిన పడకపైఁగూడ కూర్చుండరాదు. కొంచెము వాతము చేసినట్లున్నది. అబ్బ! చలిదన్నములేక అనారోగ్యము— సుఖములేదు.

(పిమ్మట నొక చెలికత్తె ప్రవేశించును.)

చెలి

(నడచి ముందుకుచూచి) ఆర్య వసంతకుఁడెచ్చటికి పోయి నాఁడోకదా? (కొంతనడచి ఎదుటచూచి) ఇదిగో ఆర్యవసంతకుఁడు (సమీపించి) ఏమయ్యా! నిన్నెంతసేపు వెదకుదుము?

వసంతకుఁడు

(చూచి) నన్నేల వెదకుచుంటివి ?

చెలి

అల్లుఁడుగారి స్నానమైనదేమో మహారాణి అడిగిరమ్మన్నది.

వసంతకుఁడు

ఎందులకు !

చెలి

ఇంకెందుకు ? పూవులు గంధము తెచ్చుటకు.

వసంత

ఆయన స్నానమైనది. భోజనముతప్ప తేవలసినవన్నియు తేవచ్చును.

చెలి

భోజన నిషేధమేల ?

వసంత

కోకిలకన్నులవలె ఈ అభాగ్యునిపొట్టలో నేదో తిరుగుచున్నది.

చెలి

(నవ్వుచు) అట్లే యుండవలెను.

వసంత

నీ ఆశీర్వచనములకేమిగాని —— వెళ్లు—నేనును మారాజునొద్దకు పోవుదును.

(నిష్క్రమింతురు.)

ప్రవేశకము

(పరివారముతోడను, వాసవదత్తతోడను పద్మావతి ప్రవేశించును.)

చెలి

రాజకుమారి ఉద్యానవనమునకు దారితీసిన కారణమేమి ?

పద్మావతి

సఖీ ! నీవుపెంచిన శేఫాలికవుపొద పూఁచినదో లేదో చూచుటకు.

చెలి

అమ్మా ! నీకై చక్కఁగా పూఁచినది. పగడములలోని ముత్తెపు గుత్తులవలె పూలు విరయఁబూచినవి.

పద్మావతి

సఖీ : అట్లయినచో నింకను నేల కాలయాపన చేయుదువు ?

చెలి

రాజకుమారి ఒకింతసేపు ఈశిలాఫలకమునఁ గూర్చుండిన పూలుగోసి తెత్తును.

పద్మావతి

(వాసవదత్తతో) అమ్మా ! ఇచట గూర్చుందమా ?

వాసవదత్త

కానిమ్ము.

(వారిద్దఱు కూర్చుందురు)

చెలి

(పూలుకోసి) రాజకుమారీ చూడుచూడు. సగమెత్తినదైన మణిశిలముక్కలవంటి శేఫాలికా పుష్పములతో నా దోసిలి యెట్లు నిండినదో!

పద్మావతి

(చూచి) ఓహో! ఏమి! పూలయందము, (వాసవదత్తతో) అమ్మా చూడుచూడు.

వాసవ

ఓహో! పుష్పసౌందర్యము!

చెలి

రాజకుమారీ! కోయుదునా! మఱికొన్ని?

పద్మావతి

చాలు చాలు. ఇఁక వద్దు.

వాసవ

ఏమి?

పద్మావతి

ఆర్యపుత్రుఁ డిక్కడికి వచ్చి ఈ పుష్పసంపదను జూచిన నా కెంతయో సన్మానము.

వాసవ

సఖీ! నీ భర్త నంతగా ప్రేమించితివా?

పద్మావతి

అమ్మా! నాకుఁ దెలియదు. ఆర్యపుత్రుఁడు నిమిషము గాన్పించనిచో ఏమో దిగులుగా నుండును.

వాసవ

(తనలో) ఈమెకే యింత మమకారమున్నదిగదా! నే నెంత కఠినురాలనైతిని.

చెలి

రాజపుత్రి సత్కులమునకుఁ దగినట్లు తన భర్తృప్రేమను వెల్లడించినది.

పద్మావతి

ఒక సందేహము నన్ను బాధించుచున్నది.

వాసవ

ఏమది?

పద్మా

ఆర్యపుత్రుఁడు నన్ను ప్రేమించినంతగా వాసవదత్తనుగూడ ప్రేమించెనా యని?

వాసవ

ఇంతకంటె నెక్కువ.

పద్మా

నీ కెట్లు తెలియును?

వాసవ

(తనలో) అయ్యో! ఆర్యపుత్రునందలి పక్షపాతముచే నాచార మతిక్రమించితిని. ఇట్లు చెప్పెదను (ప్రకాశముగ) ఆమె ప్రేమ స్వల్పమే యయిన స్వజనమును విడిచి ఏల యతనితో వచ్చును?

పద్మా

ఔనమ్మా! నిజమే.

చెలి

అమ్మా! నీవు కూడ భర్తతో 'నేనును వీణ నేర్చుకొందు' ననలేకపోయితివా ?

పద్మా

ఆర్యపుత్రునితో ననకపోలేదు.

వాసవ

అనిన నేమి చెప్పెను ?

పద్మా

ఏమియు మాటలాడక పెద్ద నిట్టూర్పువిడిచి ఊరకుండెను.

వాసవ

దానికి కారణ మేమందువు ?

పద్మావతి

పాపము! వాసవదత్తగుణములు జ్ఞప్తికివచ్చి గంభీరుడగుటచే ఎదుట కన్నీటినాపుకొనె నని తలంతును.

వాసవ

(తనలో) ఇది నిజమైనచో నేనెంత ధన్యురాలను !

(అంతట రాజును, వసంతకుఁడును ప్రవేశింతురు.)

వసంత

(వికారముగా నవ్వుచు) హా- హా- హా- పూలుకోయుటలో జేతినుండిజారి యంచందుబడిన బంధూకపుష్పములతో నీ ఉద్యాన వనమెంత రమణీయముగా నున్నది ! (రాజునుద్దేశించి) అయ్యా! ఇటు——ఇటు.

రాజు

మిత్రమా ! ఇదిగో వచ్చుచున్నాను.

మున్నొకనాఁడవంతికను భూపతిపుత్రికఁజూచినంత నా
పన్నతనొందినాఁడ మరుబాణములై దిట; నాఁటిగాయమే
యున్నదిమానకుండ, మఱియున్శరపీడనముప్పతిల్లె; నే
తెన్నునవచ్చెనోగద; రతిప్రభువర్యున కాఱుబాణముల్.

వసంత

పద్మావతీదేవి కాన్పించదేమి ! ఏదైన పొదరింటిలో నున్నదా? లేనిచో పులిచర్మముపఱచినట్లు పూలుపఱచిన పర్వతతిలకమను శిలాఫలకముపైఁగాని కూర్చున్నదా ! లేక వాసనతో తలదిమ్మెత్తించు ఏడాకులరఁటితోఁటలో ప్రవేశించినదా ? లేక మృగపక్షి చిత్రచిత్రితమైన దారుపర్వతమునకు వెళ్లినదా ? (పైకిచూచి)

హో- హో- హో- శరత్కాల నిర్మలాకాశమున నలంకరించిన బల రాము బాహువువలె మనోహరమైన బెగ్గురుపక్షులబారు పోవుచు న్నది ; చూడుము.

రాజు

మిత్రమా ! చూచుచున్నాను.

సమముగనాయతంబుగను సాగెడిసారసపంక్తి చూడు, త
త్క్రమమునతోన్నతంబగుగదా విరళమ్మయి; సప్తమౌనివం
శముగతివక్రమౌమరలుజాడలు, కూసమువీడుసర్ప గ
ర్భమువలె దోఁచునింగికివిభాగపుసీమయనంగ రాజిలున్.

చెలి

రాజకుమారీ ! ఇదిగో తెల్లతామరపూదండవలె బారులుతీఱి పోవు సారసపంక్తిని చూడుము (గమనించి) ఓహో.... భర్త

పద్మా

ఔను ! ఆర్యపుత్రుఁడు. (వాసవదత్తతో) అమ్మా ! నిన్ను బట్టి ఆర్యపుత్రుని సమీపింపఁజాలను. కనుక నీమాధవీలతామండ పమున బ్రవేశింతము.

వాసవ

సరే. (అట్లు చేయుదురు.)

వసంత

శ్రీ పద్మావతీదేవి ఇచటికివచ్చి వెడలిపోయియుండును.

రాజు

ఏ కెల్లుతెలిసినది ?

వసంత

ఇదిగో ఈపూలుపుణికిన శేఫాలికపుగుత్తులు చూడుము.

రాజు

ఓహో ! ఏమిపుష్పసౌందర్యము వసంతకా !

వాసవ

(తనలో) వసంతకుఁడని వినగానే మఱల ఉజ్జయినిలో నున్నట్లున్నది.

రాజు

వసంతకా ! ఈశిలాఫలకమునందే కూర్చుండి పద్మావతీదేవి కొఱకు నిరీక్షింతము.

వసంతకుఁడు

సరే ! (కూర్చుండి లేచి) అబ్బ ! చుఱుకైన శరత్కాలపు టెండ దుస్సహముగా నున్నది. ఈ మాధవీలతామండపమునఁ బ్రవేశింతము రమ్ము !

రాజు

నిజమే, నడుపుము.

వసంత

రమ్ము—(ఇరువురును ముందుకు నడతురు)

పద్మా

ఆర్య వసంతకుఁ డిప్పుడు వ్యాకులము తెచ్చిపెట్టుచున్నాఁడు. ఏమి చేయుదము ?

చెలి

అమ్మా ! తుమ్మెదలు నిండిన ఈ ఊఁత తీఁగెను కదిపి భర్త రాకుండ చేయుదును.

పద్మావతి

అట్లే చేయుము.

వసంత

అబ్బబ్బ ఆఁగవయ్యా....ఆఁగు.

రాజు

ఏమి ?

వసంత

ఈ గండుతుమ్మెదలు కుట్టివేసినవి.

రాజు

వద్దు — వద్దు. ప్రవేశించవద్దు. మనము తుమ్మెదలను బాధించవద్దు.

మధుమదవిలాస గానవన్మధుపవితతి
యంగజార్తప్రియాలింగ నాతిసౌఖ్య
మనుభవించుచు నుండెడి ; చనిన మనము
కలఁత గదిరి మావలె వియోగము ఘటిల్లు.

వసంత

సరే! పోనిమ్ము.

(ఇరువురును గూర్చుందురు)

చెలి

అమ్మా! మన మిచ్చట బంధింపఁబడినారము.

పద్మా

మహాభాగ్యము. ఆర్యపుత్రుఁ డిచటనే కూర్చున్నాఁడు.

వాసవదత్త

(తనలో) అదృష్టవశమున నార్యపుత్రున కిప్పటికి స్వస్థత చేకూరినది.

చెలి

రాజకుమారీ! ఈమె కన్నులేలనో నీటితో నిండినవి.

వాసవ

ఇదిగో ఈ తుమ్మెదల యాగడముచే తెల్లుపుప్పొడి పడి నా కనుల నీరు గ్రమ్ముచున్నది.

పద్మా

ఔను.

వసంత

అయ్యా! ఈ వనము నిర్జనము. నిన్ను కొంచెము అడుగవలసియున్నది. అడుగుదునా?

రాజు

ఓ, నీ యిష్టానుసారముగా,

వసంత

అయిన నీ కెక్కువ ప్రియురాలు—అప్పటి వాసవదత్తయా? యిప్పటి పద్మావతియా?

రాజు

ఎందుకోయీ! నన్నసందర్భపుప్రశ్నతోఁ జిక్కుపఱతువు.

పద్మా

సఖీ! ఆర్యపుత్రుఁడు చిక్కులోఁ బడినాఁడు.

వాసవ

(తనలో) ఈ దురదృష్టవంతురాలు గూడ,

వసంతకుఁడు

స్వేచ్ఛగా నీవు చెప్పవచ్చును, ఏమందువా? ఒకామె లేనే లేదు. రెండవయామె దగ్గరలేదు.

రాజు

మిత్రమా! నేను చెప్పను—చెప్పను. నీవు వట్టివాచాలుఁడవు.

పద్మా

ఈ మాటతో నార్యపుత్రుఁడు చెప్పినట్లే యైనది.

వసంత

నిజముగాఁ బ్రమాణము చేయుచున్నాను. ఎవ్వరికిని జెప్పను. ఇదిగో నా పెదవులు బిగించితిని,

రాజు

అబ్బ ! చెప్పనోయి !

పద్మ

ఏమి ! వీని మూర్ఖత్వము. ఇంతటనైన హృదయము గ్రహింపఁడేమి ?

వసంత

ఏమి ! నాకుఁజెప్పవా ! చెప్పక ఈజాతిపలకనుండి ఒక్కఅడుగైనను కదలలేవుసుమా ! ఇదిగో నిన్ను బంధించితిని.

రాజు

ఏమి - బలాత్కారమా ?

వసంత

ఔను - బలాత్కారమే,

రాజు

అయినఁ గానిమ్ము. చూతును.

వసంత

అయ్యా ! మన్నింపుము. మన స్నేహముమీద నొట్టు చెప్పనిచో.

రాజు

ఏమిగతి ! వినవయ్యా ! సౌందర్యసౌశీల్యములచే పద్మావతి నా కిష్టురాలే. కాని వాసవదత్తయందు నిలిచిన నా మనస్సును మాత్ర మాక్రమింపఁజాలదు.

వాసవ

(తనలో) ఔనౌను. నా యీ పడుశ్రమకు వేతనము లభించి నది. ఆహా ! ఈ యజ్ఞాతవాస మెంత గుణవంతము.

చెలి

రాజకుమారీ ! నీ భర్త యెంత దాక్షిణ్యహీనుఁడు.

పద్మా

సఖీ ! కాదు....కాదు. ఆర్యపుత్రుఁ డెప్పుడును దాక్షిణ్య వంతుఁడే. కనుకనే ఆతఁ డిప్పటికిని వాసవదత్త సద్గుణములను స్మరించుచున్నాఁడు.

వాసవ

కల్యాణీ ! కులమునకు దగినమాట పల్కితివి.

రాజు

నేను చెప్పితిని గదా ! ఇంక నీవు చెప్పుము ? నీ కెవరు నచ్చిరి ? అప్పటి వాసవదత్తయా—ఇప్పటి పద్మావతియా ?

పద్మా

(నవ్వుచు) ఆర్యపుత్రుఁడు కూడ ఇప్పుడు వసంతకుఁ డయి నాఁడు.

వసంత

నే నట్టె వాగను. ఇద్దరును నాకు నచ్చిరి,

రాజు

ఓరి మూర్ఖా ! నానుండి బలాత్కారముగా విని నీ విప్పుడు చెప్పవా ?

వసంత

ఏమి ! నన్నుకూడ బలాత్కరింతువా ?

రాజు

ఔను ! బలాత్కారమే.

వసంత

అయిన ! వినలేవు,

రాజు

ఓయి మహాబ్రాహ్మణ ! మన్నింపుము. స్వతంత్రముగానే చెప్పుము,

వసంత

సరే ! వినుము, పూజ్యురాలు వాసవదత్తపై నా కపారగౌరవము. శ్రీపద్మావతి చక్కనిచుక్క. క్రోధ, అహంకారములు లేనిది. మధురభాషిణి. దాక్షిణ్యవతి. వాసవదత్తయెడమాత్ర మింకొక సుగుణము. ఆమె ఆర్యవసంతకుఁ డెచ్చటికి పోయినాఁడో యని వెదకి వెదకి మంచిభోజనము పెట్టుచుండెడిది.

వాసవ

ఔను. వసంతకా ! ఔను. దానినే తలంచుకొనుచుందుము.

రాజు

సరే ! వసంతకా ! ఈసంగతియంతయు దేవివాసవదత్తతో చెప్పెదను.

వసంత

వాసవదత్తపోయినది. ఇంకెక్కడివాసవదత్త -- వాసవదత్త అదృశ్యురాలై చిరకాలమైనది.

రాజు

(దుఃఖముతో) అట్లనా ! వాసవదత్త మరణించినదా. నీ పరిహాసముచే నామనస్సు కలుషితమైపోయినది. పూర్వపు టలవాటు చొప్పున అమాటయే నానోటివెంట నప్రయత్నముగా వచ్చినది.

పద్మా

చక్కనిసంభాషణము నీ దుర్మార్గుఁడు మలినమొనరించినాఁడు.

వాసవ

(తనలో) విశ్వసించితిని. ఓహో - నాకెంత ప్రియవచనము. ఇట్టిమాట పరోక్షముగా వినుచుంటిని.

వసంత

అయ్యో ఓర్చుకొను మోర్చుకొనుము. విధినతిక్రమింపలేము గదా ? ఇప్పటికింతే.

రాజు

మిత్రమా ! నాయవస్థ నెఱుఁగవు:

ప్రియజనవియోగశోకమ్ము విస్మరింప
పాదుకొనెనెట్లొ రాగప్రవాళ మిపుడు
కాని తలఁచినపొరలుదుఃఖమ్ము : బాష్ప
ధార, ఋణమేది చిత్తమ్ము తేరుకొనును.

వసంత

ఇతనిముఖము కన్నీటిచేఁ గలుషితమయినది. కొంచెము నీరు తేవలెను. (పోవును.)

పద్మా

అమ్మా ! ఆర్యపుత్రునిముఖము బాష్పాకులితమైనది. వెడలి పోవుదము.

వాసవ

సఖే ! (ఆలోచించి) కాదుకాదు నీవుండుము. వ్యాకులుఁడైన భర్తను విడిచిపోవుట తగదు—నేనేపోవుదును.

చెలి

అవంతిక మంచిమాటచెప్పినది. రాజకుమారీ ! భర్తను సమీపింపుము.

పద్మా

సమీపింపుమందువా !

వాసవ

సఖీ ! వెళ్లుము. (నిష్క్రమించును.)

(వసంతకుఁడు ప్రవేశించి)

వసంత

(తామరాకుదొన్నెలో నీరుతెచ్చి పద్మావతినిచూచి) ఇదిగో పద్మావతీదేవి !

పద్మా

వసంతకా ! ఇదియేమి ?

వసంత

(కళవళపడుచు) ఇదేనా ? ఇదీ....ఏది ?

పద్మా

అయ్యా—చెప్పవేమి ? కానిమ్ము.

వసంత

అమ్మా ! గాలిలోవచ్చిన తెల్లుపుప్పొడివలన నీతనికన్నుల నీరు గ్రమ్మినది. కనుక నిదిగో ఈనీటినితీసికొని........

పద్మా

(తనలో) ఓహో ! దాక్షిణ్యముగలవారి భృత్యులకుఁగూడ దాక్షిణ్యము, (రాజుతో) ఆర్యపుత్రా ! జయము. ఇదిగో ! ముఖముకడుగుకొనుటకు నీరు.

రాజు

(కన్నులు తెఱచి) ఇదిగో పద్మావతీదేవి (వసంతకునితో) వసంతకా ! ఇదియేమి ?

వసం॥

(చెవిలో) ఇది సంగతి.

రాజు

బాగు — బాగు. వసంతకా ! (ఆచమించి) పద్మావతీ ! కూర్చుండుము.

పద్మా

చిత్తము (కూర్చుండును)

రాజు

పద్మావతీ !

శారదశశాంకవర్ణమ్ము, మారుతాతి
పాతధూతమ్ము, కాశపుష్పములధూళి
జలజలనిరాల కన్నులకలఁకపుట్టి
బాష్పములుగ్రమ్ముకొనివచ్చె- పద్మనయన !

వసంత

మిత్రమా ! పూజ్యుడగు మగధరాజు మధ్యాహ్నము నిన్ను పురస్కరించుకొని మిత్రులను జూచును. గౌరవమునకు గౌర

వముకలిసిన మిక్కిలిసంతోషము కలుగునుకదా! కనుక నిచటి నుండి త్వరగా లేవవలసియున్నది.

రాజు

మంచిది.

సద్గుణమ్ములనిధులు, విశాలధర్మ
వర్తనులుధాత్రిపైఁగనంబడుదురైన
తాదృశవిశిష్టగుణ జనతావిశేష
మహిమమునుజూచి కీర్తించుమనుజులరుదు.

(అందరు నిష్క్రమింతురు.)

---

# స్వప్నవాసవదత్తము

## పంచమాంకము

(పద్మినిక ప్రవేశించును.)

పద్మినిక

మధురికా! మధురికా! త్వరగా నొకసారి యిటురమ్ము.

(మధురిక ప్రవేశించి)

మధురిక

సఖీ! వచ్చితిని, ఏమికావలెను.

పద్మి

రాజకుమారిపద్మావతీదేవికి తలపోటుగానున్నది, నీవెఱుఁగవా?

మధు

అయ్యో! నేనెఱుఁగను.

పద్మి

సఖీ! తొందరగాపోయి యవంతికతో రాజకుమారికి తలపోటుగానున్నదని చెప్పిరమ్ము. వెంటనే యామెబయలుదేరివచ్చును.

మధు

సఖీ! ఆమె ఏమిచేయఁగలదు.

పద్మి

ఆమె తియ్యనికథలుచెప్పి రాజకుమారికి తలపోటు లేకుండ జేయఁగలదు.

మధు

రాజకుమారి యెచటఁబండుకొన్నది ?

పద్మి

సముద్రగృహమున. నీవుత్వరగాఁబొమ్ము. నేనుగూడ భర్తకు దెలుపుటకు వసంతకుని వెదకుదును.

మధు

మంచిది. (పోవును.)

పద్మి

వసంతకుఁ డెచటనున్నాఁడోగదా ?

(వసంతకుఁడు ప్రవేశించును.)

వసంత

వాసవదత్తావియోగదుఃఖితుఁడగు శ్రీవత్సరాజునకు ఇప్పుడీ పద్మావతీ పాణిగ్రహణ మంగళోత్సవమున మఱల తియ్యని తలఁపు లంకురించి కలవరపెట్టుచున్నవి. (పద్మికను జూచి). ఓహో ! పద్మినిక ! పద్మనికా ! యిటువచ్చితివేమి ?

పద్మి

వసంతకా ! నీవెయిఁగవా ? రాజకుమారి పద్మావతి తల పోటుతో బాధపడుచున్నది.

వసంత

అట్లనా ? తెలియలేదు.

పద్మి

అయిననీవిషయము భర్తకెఱింగింపుము. నేనుకూడ వెళ్ళి తలకు పూయుమందునొకటి సిద్ధముచేయుదును.

వసంత

పద్మావతి ఎచట శయనించినది ?

పద్మి

సముద్రగృహమున.

వసంత

సరే ! నీవువెళ్ళు. నేనుకూడ ఈసంగతి మారాజునకు దెలు పుదును. (పోవుదురు.)

ప్రవేశకము

(రాజు ప్రవేశించును.)

కాంచినాఁడను కల్యాణగరిమమఱల
నైనలావాణకాగ్ని హవ్యాయితాత్మ
యమ్మహాసేనపుత్రి నీహారదగ్ధ
దీనపద్మినిపోలె జ్ఞప్తికినివచ్చు.

(వసంతకుఁడు ప్రవేశించును.)

అయ్యా! మనముకొంచెము తొందరగా పోవలసియున్నది.

రాజు

ఎందులకు?

వసంత

శ్రీపద్మావతీదేవి శీర్షవేదనతో బాధపడుచున్నది.

రాజు

ఎవరుచెప్పిరి?

వసంత

పద్మినిక —

రాజు

అయ్యో! సురూపవతి సుగుణవతియు నగు పద్మావతిని చేపట్టినదిమొదలు నాదుఃఖము కొంచె ముపశమించినట్లున్నది. కాని పూర్వదుఃఖములచే గాయపడిననామనస్సు పద్మావతియెడలఁ గూడ నేదో కీడునే శంకించుచున్నది. సరే! ఇపుడు పద్మావతి ఎచటనున్నది?

వసంత

సముద్రగృహమున బండుకొన్నది.

రాజు

అయినచో అటు నడువుము.

వసంత

రమ్మి : (ఇరువురు నడతురు.)

రాజు

ముందు నీవు ప్రవేశింపుము.

వసంత

సరే! (ప్రవేశించి) అగవయ్యా! ఆగు.

రాజు

ఏమి ?

వసంత

ఇదిగో ఈదీపపుగాంతిలో స్పష్టముగా నొకపాము ప్రాకు చున్నది.

రాజు

(ప్రవేశించి, చూచి, నవ్వుచు) ఓరి! నిర్భాగ్యుఁడా నీకిది త్రాఁచుగా కాన్పించినదా ?

ద్వారముననుండి తెగి నేలజారినట్టి
తోరణపుమాల త్రాచుగాఁ దోఁచె నీకు
మందమారుతమున రేయిమసలుచుండె
పన్నగముపోలె; భీరుఁడా భయముతేదు.

వసంత

(నిదానించి) ఔనుసుమా ! ఇది త్రాఁచుకాదు. (ప్రవేశించి చూచి) బహుశః శ్రీపద్మావతీదేవి ఇచటికివచ్చి వెడలిపోయి యుండును.

రాజు

మిత్రమా ! రాలేదుకాఁబోలు

వసంత

నీకెట్లు తెలియును?

రాజు

ఇందు తెలియుటకేమున్నది ?

నలుగంగలేదు సుంతయుశయ్య తొల్లిట
పఱచినట్లే కనంబడుచునుండె
జిలుగుచిత్రముల భాసిలునట్టి ప్రచ్ఛద
పటములో ముడుతలేర్పడగలేదు
శీర్షవేదనకు వేసినయట్టివివిధౌష
ధము లంటలే దుపధానమందు
రోగపీడిత జనోద్వేగశాంత్యర్థమ్ము
కావింపలే దలంకారభరము

ప్రబలబలశత్రు హస్తానబడినరీతి
తీవ్రరోగపరిగ్రస్త దేహధారి
ఇంతనింతనె పానుపుపొంతవిడిచి
చనుటయన్నది మిగులదుష్కరముగాదె,

వసంత

అయిన నీపాన్పునందుఁ గొంతసేపువిశ్రమించి శ్రీపద్మాదేవిని బ్రతీక్షింపుము.

రాజు

మంచిది. (కూర్చుండి) నాకు నిద్ర ముంచుకొని వచ్చుచున్నదోయి—ఏదైన కథచెప్పుము.

వసంత

చెప్పెదను కాని—ఊఁకొట్టవలెను.

రాజు

సరే!

వసంత

అనఁగనఁగా ఉజ్జయిని యని యొకపట్టణము. అక్కడ చక్కని చెఱువులున్నవఁట!

రాజు

ఏమి! ఉజ్జయినియా?

వసంత

ఔను. ఇది యిష్టముకానిచో నింకొకటి చెప్పెదను.

రాజు

మిత్రమా! ఇష్టములేక పోలేదు. కాని

నాఁడవంతికలో స్వజనమునువీడి
ప్రణయభరమున నా వెంటవచ్చునపుడు
బంధువులనెంచి నా గుండెపైనిర్వాలి
తరుణి రాల్చిన కన్నీరు మఱపలేను.

పాప మెన్నోసారులు నేను వీణనేర్పునపుడామె నా ముఖము నందే దృష్టినిలిపి పారవశ్యమున వీణవాయించు కట్టిలను జార విడచి వట్టిబయల వాయించుచుండెడిది.

వసంత

సరే! ఇంకొకటివిను. బ్రహ్మదత్తమనునగరమున కాంపిల్యుఁ డను రాజు కలఁడు.

రాజు

ఏమేమి?

వసంత

(మఱల దానినే చెప్పును)

రాజు

హహ్హా! రాజు బ్రహ్మదత్తుఁడు, నగరము కాంపిల్యము.

వసంత

ఓహో! అట్లనా!

రాజు

ఔను.

వసంత

అయిన నొక్కనిమిష మోపికపట్టుము. జ్ఞాపకము చేసి కొందును. రాజుబ్రహ్మదత్తుఁడు. నగరము కాంపిల్యము. (దానినే మఱలమఱల పల్కి, రాజునుద్దేశించి) ఇప్పుడు విను (చూచి) అయ్యో! అప్పుడేనిద్రించినాఁడు. ఇది చలివేళ, దుప్పటి తెచ్చుకో వలెను. (పోవును)

(పిమ్మట వాసవదత్తయును చెలికత్తెయును ప్రవేశింతురు.)

చెలి

అమ్మా: రమ్మ, రాజకుమారి తలపోటుతో చాల బాధపడు చున్నది.

వాసవ

అయ్యో! పాపము. ఆమె యెచట పండుకొన్నది?

చెలి

సముద్ర గృహమున.

వాసవ

అయినచో ముందుగా నడువుము (ఇరువురును నడతురు)

చెలి

అమ్మా: ఇదిగో సముద్రగృహము, లోనికిపొమ్మ. తల నొప్పికి మందు తొందరగా తెమ్మని చెప్పివత్తును, (పోవును)

వాసవ

(తనలో) ఆ దేవతలకెంత నిర్దయ, విరహపీడితుఁడైన ఆర్య పుత్రునకు ఊరటకల్పించు పద్మావతికీబాధయా? పోయి చూడ

వలెను. (పోయిచూచి) ఏమిది, పరిజనుల అశ్రద్ధ. అస్వస్థమైయున్న పద్మావతిని కేవలము దీపసహాయనుచేసి వెడలిపోయినారు. పద్మావతియును నిద్రించుచున్నది. ఇచట కూర్చుందును (ఆలోచించి) దూరమున వేఱుగా కూర్చుండుట ఉత్తమస్నేహలక్షణముకాదు. కనుక పాన్పునందే కూర్చుండును.(అట్లుచేసి) ఏమిది? ఈమెవద్ద కూర్చుండగనే నా హృదయమేలాకో ఆనందనృత్యము చేయుచున్నది. మంచిది. ఈమె సుఖముగానే నిశ్వసించుచున్నది. బాధతగ్గియుండును. ఈమె ఒకప్రక్క కొత్తిగిలి పరుండుట చూడగా నన్నువచ్చి కౌఁగిలించుకొను మన్నట్లున్నది. (ప్రక్కను పరుండును)

రాజు

(కలలో) హా! వాసవదత్తా!

వాసవదత్త

(ఉలికిపడిలేచి) ఏమిది! ఆర్యపుత్రుఁడు! పద్మావతికాదు. కొంపతీసి నన్ను చూడలేదుకదా! పూజ్య యౌగంధరాయణుని మహాప్రతిజ్ఞయంతయు నిష్ఫలమై పోవునుగదా!

రాజు

హా! అవంతిరాజపుత్రీ!

వాసవ

మంచిది. ఆర్యపుత్రుఁడు కలవరించుచున్నాఁడు. ఇక్కడ నెవ్వరును లేరుగదా! (చూచి) లేరు. కొంతసేపు నిలిచి నా కంటిని హృదయమును సంతోషపెట్టుకొందును.

రాజు

హా ! ప్రియా ! ప్రియశిష్యురాలా ! మాటాడవేమి ?

వాసవ

(విచారముగా) మాటలాడుదును. ప్రభూ ! మాటలాడుదును.

రాజు

కోపగించితివా ?

వాసవ

కాదు కాదు. దుఃఖించు చున్నాను.

రాజు

కోపగించనిచో నలంకరించు కొనవేమి ?

వాసవ

ఇంతటి నీ ప్రేమకన్న అలంకారమేమి ?

రాజు

ఇంకను విరచికను తలఁచుచుంటివా ?

వాసవ

(కోపముతో) పొమ్ము, ఇక్కడ గూడ * విరచిక !

* ఉదయనుని వేఱొక ప్రియురాలు.

రాజు

అయినచో విరచిక పక్షమున నిన్ను బ్రతిమాలుకొందును. (చేతులు చాచును)

వాసవదత్త

చాలతడవైనది. ఎవరికంటనైనఁ బడవచ్చును. పోవలెను. పాన్పునుండి వ్రేలాడుచున్న ఆర్యపుత్రహస్తమును పాన్పుపై నుంచి పోవుదును. (పోవును)

రాజు

(వెంటనేలేచి) వాసవదత్తా! ఉండుముండుము అయ్యో! తొందరగాఁ బోవుచుఁ దలుపుపైఁబడితిని. నా మనోరథమున కాధారము సత్యముగా నున్నదో—లేక యిది మతిభ్రమమో నాకు తెలియుటలేదు.

(వసంతకుఁడు ప్రవేశించి)

ఇదిగో! శ్రీవత్సరాజు మేల్కొనినాఁడు.

రాజు

మిత్రమా? నీ కొకశుభవార్త చెప్పెదను. వాసవదత్త బ్రతికియే యున్నది.

వసంత

వాసవదత్త పోయినది. ఇంకెక్కడి వాసవ చిరకాలమైనది.

రాజు

మిత్రమా ! కాదు కాదు. ఇప్పుడే పాన్పునందు శయనించిన నన్ను మేల్కొలిపి పోయినది. లావాణకాగ్నిచే దహింపఁబడిన దని చెప్పి రుమణ్వంతుఁడు నన్ను వంచించినాఁడు.

వసంత

ఇది యసంభవముకాదు. ఉజ్జయిని చెలువులను స్మరించుటచే నా ధ్యానమున నీ కామె కలలో కాన్పించి యుండును.

రాజు

అట్లనా ! నేను కలలో జూచితినా ?

ఇంతతియ్యనికథ కలయేని నాదు
బ్రతుకులో తెల్వియింక రావలదు వలదు
ఇదియు మానసవిభ్రమ మేన్మని నాకు
వదలకుండుత మధురవిభ్రాంతి చిరము.

వసంతకుఁడు

మిత్రమా ! ఈ పట్టణమున నవంతిసుందరియను నొక యక్షిణి యున్నది. ఆమె నెపుడైన చూచినావా ?

రాజు

లేదు లేదు

కల కరఁగిపోయినంతనే కానఁబడెను
ఘనవిరహదీక్ష కంట నంజనములేని,
చెదరు దీర్ఘాలకములకై నేయబోని,
శీలరక్షణవతియొక్క చెలియముఖము.

భయముతో నామె పట్టుకున్న ఈ నాచేయి కలలోనిస్పర్శచేఁ బులకరించి ఇప్పటికిని రోమహర్షమును విడువకున్నది.

వసంత

నీవింక ననర్థములను దలపెట్టకుము. లోఁగిలిలోనికిఁ బోవుదము రమ్ము.

కంచుకి

(ప్రవేశించి) ఆర్యపుత్రా ! జయము. మా దర్శక మహారాజు గారు తమ కిట్లు చెప్పుచున్నారు. "మీ మంత్రి రుమణ్వంతుఁడు మీ విరోధి ఆరుణిని ప్రతిఘటించుటకు ప్రబలసైన్యముతో నిచటికి వచ్చినాఁడు. నా చతురంగ బలమంతయు సన్నద్ధముగా నున్నది. కనుక వెంటనే బయలుదేరవలెను." అని—

పాఱెను భేదనోపాయమ్ము సూటిగా
ప్రబలభవ ద్రిపుప్రకరమందు,
హర్షించెనౌర పౌరావళి నీ యుత్త
మోత్తమగుణ గణాభ్యుదయమునకు,
నియమించినాఁడ పార్ష్ణిబలమ్మును నీదు
రణయాత్రయందు రక్షణము కొఱకు,
ఒనరించితిని శత్రుహనన కార్యమునకై
సర్వసన్నాహ మఖర్వముగను,

రంగదుత్తుంగ భంగాభిరామ గంగ
దాఁటిచనెనదె నీసైన్యకోటి యపుడె
ఆలసింపకు మ్రోయు ప్రయాణభేరి
వత్సదేశమ్ము నీ చేతఁ బడిన దనుము.

(రాజులేచి) ఇప్పుడునేను

రాజు

దారుణాకృత్యనిరతుఁడౌ యారుణారి
దరిసి గజహయ సముదాయ తరణయోగ్య
కీర్ణ బాణోగ్రభంగ యుద్ధార్ణవమ్మ
నందుఁ బరిమార్చెదను నిశ్చయమ్ము సుమ్ము.

(అందఱును నిష్క్రమింతురు)

---

# స్వప్నవాసవదత్తము

షష్ఠాంకము

(కంచుకి ప్రవేశించును)

కంచుకి

కాంచనతోరణద్వారమువద్ద నెవరున్నారు ?

(ప్రతీహారి ప్రవేశించును)

ప్రతీహారి

అయ్యా ! నేను విజయను. ఎందులకు ?

కంచుకి

అమ్మా ! వత్సరాజ్యలాభ ధన్యుఁడైన ఉదయనరాజునకు చెప్పుము. మహాసేన మహారాజువద్దనుండి రైభ్యుఁడను కంచుకియును, శ్రీ అంగారవతీదేవివద్దనుండి వసుంధరయను వాసవదత్తాదేవి దాదియును, వచ్చి దర్శనమునకుఁ బ్రతీక్షించు చున్నారు.

ప్రతీహారి

ఆర్యా ! ఇది సమయముకాదు.

కంచుకి

ఎందుచేత ?

ప్రతీహారి

ఇప్పుడు శ్రీ ఉదయనప్రభువు వినుచుండగా నెవ్వరో సూర్యముఖ ప్రాసాదమున వీణవాయించినారు. రాజదివిని 'ఏమిది! ఘోషవతిధ్వనివలె వినబడుచున్న'దనెను.

కంచుకి

తరువాత ?

ప్రతీహారి

వెంటనే రాజు వీణవాయించుచోటికివెళ్ళి "యీ వీణ ఎచటి నుండి వచ్చెను." అని యడిగెను. అంతటవైణికుఁడు "మేము నర్మదా నదీతీరమున నొక పొదరింటిలోఁ బడియుండగాఁ జూచి దీనిని దెచ్చినారము. అవసరమైనచో ప్రభువు స్వీకరింపవచ్చును." అని పల్కినాఁడు. అంతట నీయన దానిని దెప్పించి తొడపైఁ బెట్టు కొని మూర్ఛిల్లినాఁడు. పిమ్మట కొంతసేపటికి మూర్ఛనుండి తేరుకొని కన్నీటిముఖముతో "ఘోషవతీ, ఎన్నినాళ్ళకు కానిపించితివి! ఆమె మాత్రము కానరాలేదుకదా!" అని పల్కెను. అయ్యా! సమయ మిట్లున్నది. వారికెట్లు మనవిచేయుదును ?

కంచుకి

అమ్మా! భయములేదు. విన్నవింపుము. ఇదిగూడ దానికి సంబంధించిన విషయమే.

ప్రతీహారి

అయ్యా? సరే! చెప్పెదను. ఉదయనప్రభువు సూర్యముఖ ప్రాసాదమునుండి దిగుచున్నారు. వెంటనే మనవి చేయుదును.

కంచుకి

అమ్మా ! మంచిది.

(ఇరువురును వెడలిపోవుదురు)

(మిశ్ర విష్కంభము)

(రాజును వసంతకుఁడును ప్రవేశింతురు)

రాజు

శ్రవణసుఖదాయినీ, మున్ను రాజపుత్రి
ఘనపయోధరజఘనసుఖప్రసుప్త
వై యిపుడు పక్షిధూళిలో బడిపొరలుచు
నెట్లు కానన వసతి వరించినావు !
తలఁపవో ? తత్కటీసముద్వహన సుఖము,
మఱచితే — ఖిన్నతత్కుచ మండలోప
గూహనము, మద్వియోగ వాగ్రుదితరీతి,
మేలివాద్యాంతరముల సస్మితమృదూక్తి.

వసంతకుఁడు

రాజా ! ఎంతవిచారించిన నేమిప్రయోజనము ?

రాజు

మిత్రమా ! కాదు కాదు.

చిరతరమ్ముగ హృదిని మూర్ఛిల్లినట్టి
మాన్మథవ్యథ మేల్కాంచి మథనపెట్టు,
వీణవీక్షించినంత, కాన్పింపబోదు
ఘోషవతి కూర్మిచెలి, యాచకోరనయన.

వసంతకా ! వెంటనే శిల్పివద్దకుఁబోయి దీనిని సరి చేయించి తీసికొని రమ్ము.

వసంత

(వీణపట్టుకొని) చిత్తము. (పోవును)

ప్రతీ

(ప్రవేశించును) ప్రభూ ! జయము. శ్రీమహాసేన మహారాజు వద్దనుండి రైభ్యుఁడను కంచుకియును, అంగారవతీదేవి వద్ద నుండి వసుంధరయను వాసవదత్తాదేవి ధాదియును, వచ్చి దర్శనము కొఱకు వేచియున్నారు.

రాజు

ఓహో ! అట్లనా ! అయిన పద్మావతినొకసారి పిలువుము.

ప్రతీ

చిత్తము. (పోవును)

రాజు

(తనలో) ఏమి ! అప్పుడే ఈ సంగతి మహాసేనుని వఱకుఁ బ్రాకినదా !

(పద్మావతి, ప్రతీహారి, ప్రవేశింతురు)

ప్రతీ

అమ్మా ! రమ్మా.

పద్మా

ఆర్యపుత్రా ! జయము.

రాజు

పద్మావతీ ! వింటివా ! మహాసేనునివద్దనుండి ఒక రంచుకి యును, అంగారవతీదేవివద్దనుండి వాసవదత్తదాదియును వచ్చి యున్నారు.

పద్మా

ఆర్యపుత్రా ! చాలసంతోషము. బంధుకుశల వృత్తాంతము విందము.

రాజు

మంచిమాటపలికితివి. వాసవదత్త స్వజనమును, నీ స్వజన ముగా నెంచుచున్నావు. ఎంతయౌదార్యము ! పద్మావతీ ! కూర్చుండ వేమి ?

పద్మా

ఆర్యపుత్రా ! నేను దగ్గరనుండగా వారిని జూడఁదలఁచు చున్నారా !

రాజు

ఔను. తప్పేమి ?

పద్మా

ఆర్యపుత్త్రుఁడింకొకరిని బెండ్లాడెనని నాయెడల వా రుదాసీన ముగా నుందురేమో.

రాజు

భయములేదు. చూడఁదగిన వారికి భార్యను జూపకుందుట తప్పు. కూర్చుండుము.

పద్మా

చిత్తము. (కూర్చుండి) ఆర్యపుత్త్రా ! నాయనగారును అమ్మ గారును ఏమందురో అని కొంచెము జంకుచున్నాను.

రాజు

పద్మావతీ ! నిజమే. వారేసందేశము పంపినారో యని నా మనస్సు తల్లడపడుచున్నది. వారిపుత్త్రిక నపహరించి తెచ్చి తాఁపాడలేకపోయితిని. చంచలభాగ్యగర్వమున సద్గుణములకు లోపము కల్పించుకొని, తండ్రికిఁ గోపమురప్పించిన పుత్త్రినివలె భయపడుచున్నాను.

పద్మా

ఆ సమయమున రక్షించుటకు శక్యము కాకపోయినదా ?

ప్రతీహారి

(ప్రవేశించి) ప్రభూ ! కంచుకియును, దాదియును వచ్చినారు.

రాజు

వెంటనే రమ్మనుము.

ప్రతీ

చిత్తము. (పోవును)

(కంచుకియును, దాదియును, ప్రతీహారియును ప్రవేశింతురు)

కంచుకి

మా నృపాలుని బంధుసామ్రాజ్య దర్శ
నమున హర్షమ్ము రాజనందన మృతికిని
దారుణ విషాదమగును; దుర్దైవహతక!
రాజ్య నాశమ్ము చాలక రాణిగొంటె?

ప్రతీ

అరుగో — ప్రభువు — సమీపింపుఁడు.

(కంచుకి సమీపించి)

కంచుకి

ఆర్యపుత్రా! జయము.

దాది

ప్రభూ! జయము.

రాజు

(సగౌరవముగా) అయ్యా ! భూమండలమునందలి సకల రాజ మండలమునకు భాగ్యాభాగ్యకరణ సమర్థుఁడు నా ప్రియబాంధవుఁడు శ్రీ మహాసేనునకుఁ గుశలమా ?

కంచుకి

చిత్తము. మహాసేన మహారాజునకుఁ గుశలమే. ఇచటి యందరి క్షేమమును నడుగుచున్నారు.

రాజు

(లేచి) ఆయన ఏమాజ్ఞాపించినారు ?

కంచుకి

ప్రభూ ! వైదేహీపుత్రులైన తమకీ వినయగరిమ యుక్తమే. కాని, తమరు....ఆసనమునందుఁ గూర్చుండియే మహాసేన సందేశమును వినఁగోరుచున్నాను.

రాజు

మంచిది. (కూర్చుండును)

కంచుకి

"శత్రువు లపహరించిన రాజ్యము నదృష్టముచే మఱలనీవు గైకొనినందులకు చాలసంతోషము. ఏలయనఁగా భయస్థులకును, అశక్తులకును, ఉత్సాహమే శూన్యము. ఉత్సాహశక్తి గలవారే రాజ్యలక్ష్మి ననుభవింపఁగలరు" అని.

రాజు

అయ్యో ! ఇది యంతయు మహాసేన దయాప్రభావము.

చెఱగొని మున్ను నన్ను నృపశేఖరుఁ డాత్మజ నిర్విశేషవై
ఖరిప్రియమారఁజూచె : నృపకన్యకఁదోడ్కొనివచ్చి నేనునున్
దిరముగ కావలేనయితి ; నిష్ఠుర తన్మృతివార్త విన్నసున్
నరపతి ముద్దుసేయునను, నా జయలబ్ధి కతండె హేతువా.

కంచుకి

ఇది మహాసేనుని సందేశము. అంగారవతీదేవి సందేశమును వసుంధర చెప్పును.

రాజు

అయ్యో ! తల్లీ ! పదునార్గురు రాణులలో నగ్రగణ్యురాలు, ఉజ్జయినీ నగరపుణ్యదేవతామూర్తి—మా వియోగదుఃఖ పీడితురాలైన తల్లి అంగారవతీదేవికి క్షేమమా ?

దాది

మహారాజ్ఞికిఁ గుశలము. ఇచటివారి యందఱిక్షేమమును నామె యడుగుచున్నది.

రాజు

అందఱిక్షేమమును నడుగుచున్నదా ? (అంగారవతి నుద్దేశించి) అమ్మా ! ఇక్కడి క్షేమమిట్లున్నది !

దాది

ప్రద్యో : ఎంతపరితపించిన నేమిలాభము ?

కంచుకి

ఆర్యపుత్రుఁడు కుశలముగానున్న సంతియేచాలును. మీ ప్రేమ కెంతగా పాత్రమైన మహాసేనపుత్రి మరణించినను మృతజీవ.

మృత్యుకాలమ్ముననెవ్ గావ నెవరితరము ?
రజ్జువిచ్ఛేదమున ఘటత్రాతయెవఁడు ?
కాననమ్మను బోలు లోకప్రవృత్తి,
మాటిమాటికిఁ దెగుచుండు మఱల మొలచు.

రాజు

అయ్యా ! కాదుకాదు. నా కతిప్రియురాలును, శిష్యురాలును నయిన మహాసేనపుత్రిని జన్మాంతరమునందు నైత మెట్లు తలంప కుందును ?

దాది

మహారాణి యిట్లు సెలవిచ్చినది "వాసవదత్త మరణించినను నాకును, మహారాజునకును, పుత్రులు గోపాలపాలకు లెట్టివారో నీవును నట్టివాఁడవే. మొదటినుండియు మేము నిన్నేయల్లునిగా నభిలషించినాము. అందులకే ఉజ్జయినికి రప్పించితిమి. అగ్ని సాక్షిగాఁ గాకున్నను వీణమిషతో వాసవదత్తను నీ కిచ్చితిమి. బాల్యచాపల్యమువలనఁ దొందరపడి వివాహము జరుగకుండగనే వాసవను దీసికొనిపోయితివి. పిమ్మట మేము, మీయిరువురి చిత్రములను వ్రాయించి పెండ్లిచేసితిమి. ఇదిగో, ఆ చిత్రఫలకమును నీ పద్దకుపంపుచున్నాము. దీనిని జూచుకొనుచుఁ గొంత యూరట కల్పించుకొనుము" అని.

రాజు

ఆహా ! పూజ్యురాలు తనయమృతవాత్సల్యమునకుఁ దగినట్లు పల్కినది. ఈ మాటనాకు సామ్రాజ్యములకంటెఁ బ్రియతమ మైనది. అపరాధులమైనను మమ్మా మఱవక ఆమె యెంతప్రేమ చూపుచున్నది !

పద్మా

ఆర్యపుత్రా ! చిత్రఫలకమునందలి పెద్దలనుజూచి నమస్కరింపవలెనని యున్నది.

దాసి

అమ్మా ! చూడుము. (చిత్రఫలకమును చూపును)

పద్మా

(చూచి తనలో) హుఁ........ఈ బొమ్మలో ఆర్య, అవంతిక పోలికలున్నవి. (పైకి) ఆర్యపుత్రా ! ఇదియామెవలె నున్నది.

రాజు

వలెఁగాదు. ఆమెయే. ఇంతచక్కని శరీరవర్ణమున కెట్టి వినాశము దాఁపురించినది ! ఈ ముఖసౌందర్యమునెట్లు వీతి హోత్రుఁడు మాడ్చివేసినాఁడో గదా !

పద్మా

ఆర్యపుత్రునిచిత్రము సరిచూచి ఈ బొమ్మయామెదగునో ! కాదో ! తెలిసికొందును.

దాసి

రాజకుమారీ ! పరికించిచూడుము.

పద్మావతి

(చూచి తనలో) ఆర్యపుత్రునికిని జిత్రమునకుఁ జక్కని పోలికలుండుటచే నీ చిత్రమామెదేయని తలంచుచున్నాను.

రాజు

దేవీ ! చిత్రఫలకమును జూచినది మొదలు, ఏదో సంతోషముతోఁ గలవరపడుచున్నట్లు కాన్పించుచున్నా వేల ?

పద్మా

(చిత్రఫలకములోని వాసవదత్తను జూపుచు) ఆర్యపుత్రా ! ఈ బొమ్మవంటియామె ఇచటనే యున్నది.

రాజు

ఏమి ! వాసవదత్తవంటిదా !

పద్మా

ఔను.

రాజు

అయినచో వెంటనే యొకసారి రప్పింపుము.

పద్మా

ఆర్యపుత్రా ! నేను గన్యకగానున్నప్పు డొకబ్రాహ్మణుఁడు "ఈమె మా చెల్లెలు. మీ వద్దఁగొన్నినాళ్ళు తలదాఁచుకోనిమ్మని ఒప్పగించిపోయినాఁడు. ఈమె ప్రోషితభర్తృక యగుటచేఁ బర పురుషులను జూడనొల్లదు. నాతోవచ్చినప్పు డెపుడైనను జూచి గుర్తింపవచ్చును.

రాజు

ఆమెయొక బ్రాహ్మణునిచెల్లెలా ! అయిననెవతయో యన్యురాలు, లోకమున ఒకరిని పోలినవా రొకరుందురు.

(ప్రతీహారి ప్రవేశించును.)

ప్రతీహారి

ప్రభూ ! జయము. ఉజ్జయినీబ్రాహ్మణుఁడొకఁడు వచ్చినాఁడు. అతఁడు తనచెల్లెలిని రాజకుమారివద్ద నుంచినాఁడఁట. మరల నామెను దీసికొనిపోవుటకువచ్చి ద్వారమువద్ద నున్నాఁడు.

రాజు

పద్మావతీ ! నీవు వెనుకచెప్పినబ్రాహ్మణుఁడేనా !

పద్మా

అయియుండ వచ్చును.

రాజు

అంతఃపురాచారము ననుసరించి అతనిని వెంటనే ప్రవేశపెట్టుము.

ప్రతి

చిత్తము — (పోవును)

(ప్రవేశము యౌగంధరాయణుఁడు)

యౌగంధ

(తనలో)

క్ష్మాపతి హితార్థమై రాజమహిషి దాఁచి
శ్రేయమొనగూర్ప నిట్లొనరించినాఁడ.
సిద్ధిఁబడసియు, మారాజసింహుఁ డిప్పు
డేమిపలుకునోయంచు నా యెద చలించు.

ప్రతి

ప్రభువును — సమీపింపుము

యౌగంధ

(సమీపించి) జయము. జయము.

రాజు

(తనలోఁ ఈ కంఠధ్వని యెచ్చటనో వినినట్లున్నది. (పైకి) ఏమయ్యా ! మీచెల్లెలిని పద్మావతివద్ద న్యాసముగ నుంచితివా ?

యౌగంధరాయణుఁడు

ఔను.

రాజు

అయినచో నితనిచెల్లెలిని దొందరగా రప్పింపవలెను.

ప్రతీ

చిత్తము (పోవును)

(పద్మావతికూడ వెళ్ళును)

(పద్మావతియును, అవంతియును, ప్రతీహారియును ప్రవేశింతురు)

పద్మా

అమ్మా ! రమ్మా ! నీ కొక శుభవార్త.

అవంతిక

ఏమది ?

పద్మా

నీ సోదరుఁడు వచ్చినాఁడు.

అవంతిక

మంచిది. అదృష్టముచే నతనికింకను జ్ఞాపకమున్నాను.

పద్మా

ఆర్యపుత్రా ! జయము. ఇదిగో ! నావద్దనుంచిన దాఁపరికము (తెరలోని వాసవదత్తను చూపును)

రాజు

పద్మావతీ ! ఇచ్చివేయుము. దాఁపరికమును సాక్షుల సమక్షమున నీయవలెను. రైభ్యుఁడును, వసుంధరయును నిందులకు సాక్షులు.

పద్మా

(యౌగంధరాయణునితో) అయ్యా ! ఇదిగో మీచెల్లెలు తీసి కొని వెళ్ళవచ్చును.

దాది

(అంవతికనుజూచి) ఏమిది ! మా రాజకుమారి వాసవదత్త.

రాజు

ఏమి ! మహాసేనపుత్రికయా ! దేవీ ! పద్మావతితోఁ గూడ నంతఃపురములోనికిఁబొమ్ము.

యౌగంధ

వద్దు వద్దు. ఈమె నాచెల్లెలు. అంతఃపురమున కెందులకు ?

రాజు

ఏమందువు ? ఈమె మహాసేనపుత్రిక — యఁట !

యౌగంధ

రాజా ! భరతవంశశ్రేష్ఠుఁడవు — వివేకవంతుఁడవు. రాజ ధర్మము నతిక్రమించి యిట్లు బలాత్కరించుట న్యాయ్యముగాదు.

రాజు

సరే ! మేముకూడ రూపసాదృశ్యమును జూతుము. తెర తొలగింపుఁడు.

యౌగంధ

ప్రభూ ! జయము —

వాసవ

ఆర్యపుత్రా ! జయము.

రాజు

ఓహో ! ఇతఁడు యౌగంధరాయణుఁడు. ఈమె మహాసేన రాజకుమారి —

ఇదియుఁగలయగునా ? నాఁటిసుదతియీామె
మఱలఁ గాన్పించుచున్న దీపందిరమున
తొల్లి యిట్లె కనంబడి తొలఁగిపోయి
వంచనముచేసెనన్ను లావణ్యరాశి !

యౌగంధ రాయణుఁడు

ప్రభూ! నాయపరాధమును మన్నింపుము. (పాదములపైఁబడును)

రాజు

(లేపఁదీసి) నీవు నిశ్చయముగా యౌగంధరాయణుఁడవు !
సచివమణీ, కుహనోన్మాద సంగరముల
శాస్త్రదృష్టంబులైన విచారణముల
ఘనప్రయత్నంబులను నీవు మునుఁగుమమ్మ
క్లిష్టకాలమ్మునందు — రక్షించినావు.

యౌగంధ

ప్రభూ ! తమయభ్యుదయభాగ్యముల వెన్నంటి నడచువారము.

పద్మా

ఆహా ! ఈమె పూజ్యురాలు వాసవదత్త ! అమ్మా ! ఎఱుఁగ కుచే నిన్ను చెలికత్తెవలెఁజూచి నీ యెడల నపచారమొనరించితిని. తలవంచి నమస్కరించుచున్నాను (నమస్కరించును)

వాసవ

(లేవఁదీసి పద్మావతిని బుజ్జగించుచు) కల్యాణీ ! లెమ్ము లెమ్ము. ఈ క్షమార్పణముతో ఔచిత్యము నతిక్రమించుచున్నావు.

పద్మా

అమ్మా ! అనుగ్రహింపఁబడితిని.

రాజు

మిత్రమా ! యౌగంధరాయణా ! వాసవదత్తను దాఁచుటలో నీ యుద్దేశమేమి ?

యౌగంధ

కౌశాంబీపట్టణమును నిరంకుశముగాఁ బరిపాలింప వలెనని.

రాజు

అయిన నీమెను బద్మావతివద్ద నుంచుటయేల ?

యౌగంధ

పుష్పక. భద్రాదిదైవజ్ఞులు శ్రీపద్మావతి తమదేవియగుననిచెప్పిరి.

రాజు

ఇది రుమణ్వంతునకుఁ గూడఁ దెలియునా ?

యౌగంధ

(నవ్వుచు) అందరికిని దెలిసినదే.

రాజు

(ఆశ్చర్యముతో నవ్వుచు) రుమణ్వంతుఁ డెంతద్రోహి !

యౌగంధ

ప్రభూ ! శ్రీ వాసవదత్తాదేవి కుశలవృత్తాంతము దెలియజేయుట కిప్పుడే రైభ్యుని, వసుంధరను దిరిగి పంపివేయుదము.

రాజు

కాదు కాదు. మనమందఱమును వాసవదత్తా, పద్మావతులతోఁ గలసి యచటికే వెళ్ళుదము.

యౌగంధ

ప్రభూ ! మంచిది.

భ ర త వా క్య ము

రమ్యహిమవింధ్య నగయుగళాభిరామ
కుండలయు, నబ్ధిమేఖలాగుణయుతైన
ధరణినేలు నేకాతపత్రమ్ము గాగ —
మేలి మారాజసింహ భూపాలుఁ డెపుడు

(అందఱును నిష్క్రమింతురు)

స మా ప్త ము.

---